కనుఁగొన నింపగుకస్తురినామము, ననుపమాన మగునలకస్తోమముఁ
గలకల నగుచక్కనివదనంబును, ధళధళ మనురత్నకిరీటంబును
ననుకృతజలధర మగువర్ణంబును, నినకోటుల నగియెడుతేజంబును
గలుగుదివ్యమంగళవిగ్రహమున, నలరుభక్తినిత్యానుగ్రహమునఁ
బరఁగురమావిభుఁ బరమపదేశ్వరు, నిరవద్యాత్మకు నిత్యు నిరీశ్వరు
నజు నచ్యుతు హరి నఘసంహారుని, త్రిజగన్నాథుని త్రిగుణవిదూరుని
నఖిలశేషిఁ గరుణైకపరాయణు, నిఖిలవేదవర్ణితు నారాయణుఁ
గొలిచి నిత్యముక్తులు ప్రమదంబున, నలరుదు రక్కడ నతివిభవంబున. 232

వ. అందు. 233

సీ. తనవిలోచనసంజ్ఞ దవునకు భువనసర్గముఖక్రియాచార్యకంబు నడుపఁ
దనవిలాసంబు కాంతునకు శృంగారసామ్రాజ్యనీతిధురీణమంత్రి గాఁగఁ
దననర్మలీల నాథునకు దశాకృతి, ప్రకృతికాసూత్రధారత వహింపఁ
దనముద్దుఁబలుకు భక్తవితానవాత్సల్యకర్త్రి కారవికాస కారణముగ
తే. నఖిలకళలందుఁ దోడునీడగుచు మెలఁగు, నధిపునకుఁ బాలమున్నీటియాఁడుబిడ్డ
యరిది మక్కువ టెక్కువ యవిరతంబు, నురుమడింపక యతఁడు దన్నుపచరింప.

ఉ. ఆజగదేకమాత తగునట్టిప్రసంగవశంబునన్ సము
ద్వేజకభూరిసంసృతినవీనదవానలతప్యమానసా
నాజనకోటిఁ బ్రోచుకరుణారసమూర్తిఁ గడుం దొలంక నీ
రేజదళాక్షుఁ జూచి మృదురీతిఁ దలిర్పఁగ నప్పుడిట్లనున్. 235

క. దేవా యిపుడొకయర్థము, దేవర నడుగంగ బుద్ధి దివిరెడు మిగులన్
నావిన్నపముఁ బ్రసాదశ్రీ వెలయఁగ నొకటి యవధరింపఁగ వలయున్. 236

ఉ. ఈభువనంబులెల్ల సృజియింప భరింప హరింపఁ గర్తవై
శోభిలువాఁడ వీవ మధుసూదన యంబుజసంభవుండుఁ జే
తోభవవైరియున్ గ్రమముతో భవదీయకృపాసమర్పిత
ప్రాభవులై కదా కనిరి పన్నుగ సర్గలయాధికారముల్. 237

తే. జీవకోటుల నుభయకర్మావళీఫలానుభవముల దరిఁ జేర్ప నాత్మఁ దలఁచి
నీవు బ్రహ్మాండసృష్టిరక్షావిలయము, లిట్లు గావింతువని నుతియించు శ్రుతులు.

ఆ. అదియుఁగాక మొదలు తుదలేనిసుకృతదుష్క్రియలు భోగమునఁ దరింపరామి
యకట యాత్మబోధనార్థమై వేదశాస్త్రములు గలుగఁ జేసి తమలకృపను. 239

ఉ. అట్టిశ్రుతిస్మృతుల్ దెలుపునట్టియుపాయము నాదరింప కె
ట్టెట్టు చరించి ముక్తి కెడయైనజనంబులఁ బ్రోచుసత్కృపన్
నెట్టన రామకృష్ణముఖనిర్మలమూర్తులు దాల్చి తీవు ని
న్నిట్టు నుతింపనేర్తుఁ బరమేశు నకారణసత్కృపాపరున్. 240

ఉ. ఇంచుకయేని వేసరక యీగతిఁ జెక్కిలిగొట్టి పాలు ద్రా
గించువిధంబునన్ బలిమిఁ గేశవ నీవు హితంబొనర్చుచో
నెంచఁ గృతార్థుఁ డొక్కఁ డొకఁ డింతియ కాని సమస్తజీవులం
గొంచక యంతకంతకును గ్రుంకెద రుగ్రభవార్ణవంబులోన్. 241

క. ఇది యంతయు నీమాయాభ్యుదయవిలాసంబు దెలియఁ బురుషోత్తమ నీ
మదిలో నెయ్యది దలఁచిన, నొదవక మాన దని తోఁచుచున్నది నాకున్. 242

ఉ. కావున నెల్లజీవులకుఁ గారుణికోత్తమ నీయనుగ్రహ
శ్రీవిభవంబుచే నమృతసిద్ధిగఁ గోరెద సర్వశేషి వా
దేవరకున్ విభేదము మదిం గలదే యొకకొందఱన్ భవా
భావముఁ బొందఁ జేయ భవబంధులఁ గొందఱఁ జేయ నచ్యుతా 243

వ. అని యివ్విధంబున సకలరక్షణార్థంబుగాఁ బరమకరుణావేశకలితహృదయ యగుచుఁ బలుక తననెయ్యంపుఁదొయ్యలితియ్యంపుఁబలుకుల కయ్యంబుజాక్షుం డిచ్చ మెచ్చుచు నత్యాదరంబున నమ్మత్తకాశినిఁ బ్రసాదమేదురదరహసితలోచనంబుల వీక్షించి. 244

క. జనకునకంటెను జననికిఁ, దనయులపై వత్సలత్వధర్మము మిగులన్
ఘన మండ్రు గాన నీకే, యనుపమకారుణ్య ముచిత మరవిందముఖీ. 245

ఉ. అంబురుహాక్షి నీపలికినట్ల యసంకుచితప్రభావధా
ర్ష్ట్యంబున నేఁ బ్రవర్తిలుట సత్యము యైనను వారివారిక
ర్మంబులు చూడ కందఱ సమంబుగ నెవ్విధిఁ బ్రోవవచ్చు నెం
దుం బరికించి చూడ గుణదోషవివేక మనార్యకృత్యమే. 246

వ. ఆర్యానార్యకర్మంబు లేను బ్రియాంగంబులుగాఁ గొనుటకును దదుభయవ్యవస్థానిమిత్తంబై వేదరూపాజ్ఞలోకంబున నిలుపుటయును గారణంబు మత్స్వాతంత్ర్యంబ కావున వారివారికర్మంబులవెంబడినె యేను శుభం బొనరించుట స్వాభావికం బగుఁ దెలిసికొమ్మని యిట్లనియె. 247

క. విను మట్లైనను శుభవర్తన కించుకబుద్ధి జనుఁడు దలకొల్పినమా
త్రన యది యే నీడేర్చుచు, ఘనకారుణ్యమునఁ బ్రోతుఁ గంజదళాక్షీ. 248

చ. సుకృతములందునుం బరమశోభన మైనమదర్చనాదిసి
ద్ధికి ధరణీజనంబుల మదిం దలకొల్పిన కాదె యేఁ గృపా
ధికత దశావతారసముదీర్ణవిహారము పూనుటల్ దురా
త్మకులకుఁ దన్మహామహిమదర్శనమున్ వృథ యేమి సేయుదున్. 249

వ. మఱియును 250

క. అమృతపదప్రాప్తికుపాయములను మత్పూజనాదు లఖిలజనులకున్
సమకూర్పనె యుండుదు నిత్యము శ్రీరంగాదిదివ్యధామమ్ములందున్. 251

తరల. ఇదియుఁ జాలక యింకనుం గృప నెల్లజీవులఁ బ్రోవ నీ
మదిఁ గడుం దమకించితేనియు మానసంబున నాకు స
మ్మదము మిక్కిలి యెంచి చూడ సమస్తజీవదయాభిశా
భ్యుదయ మెవ్వరి కింపు గాదు పయోజపత్రవిలోచనా. 252

వ. కావున నీప్రార్థనంబునం జేసి యిప్పు డొనర్చువిశేషంబు విను మట్లు లోకానుగ్రహార్థంబుగా నేను నిత్యసన్నిధిస్థానంబులుగా నంగీకరించినశ్రీరంగ కాంచీ వేంకటాచలాహోబళపురుషోత్తమాదిదివ్యస్థలంబుల కరిగి సేవింప నోపకున్నను దమయున్నచోటనే యుండి తత్తద్దివ్యదేశనివాసు నన్ను నిజేచ్ఛానుసారంబునఁ దలంచి కేలుమొగుచువారికి సంసారంబు నుద్ధరింపఁ జేయుదునని యానతిచ్చిన సంతసిల్లి యదియె చాలు నని యమ్మహాదేవునిదీనవాత్సల్యంబు ననేకప్రకారంబుల సన్నుతించె నని చెప్పి మధురలాలస యాకళాపూర్ణమహారాజుఁ గనుంగొని యది యిప్పుడు మీఁర లడిగినభవదీయపూర్వజన్మవిరచిత లక్ష్మీనారాయణసంవాదకథాప్రకారంబు దేవరప్రశ్ననిమిత్తంబున నిశ్శ్రేయససులభోపాయంబు దొరకె నేఁడు సుదినం బయ్యె మదీయజన్మంబు సఫలం బయ్యె నని పలికి శ్రీరంగాదిదివ్యదేశమాహాత్మ్యంబునకు వెఱఁ గందుచు నింత భక్తవత్సలుండవే యని పరమపురుషు సఖిలలోకైకనాథు నారాయణుఁ దలంచి ప్రణమిల్లెఁ గళాపూర్ణుండును దదాదిగా నత్యాదరంబున విష్ణుసేవ గావించుచు ధర్మమార్గంబున రాజ్యపరిపాలనంబు సేయుచు. 253

తే. సమ్మదము మీఱఁ దనయగ్రజాయయందు
మధురలాలసయందు నమర్త్యనిభుల
సుతులఁ గాంచెఁ గ్రమంబున సుప్రసాదుఁ
డనఁగ సరసుఁ డనంగఁ బెంపారు ఘనుల. 254

క. వల పమరఁగ నవవర్షం, బులసతిఁ దనకేళి కొదవి భోగక్రియ నిం
పల రెడునట్లుగఁ జేసెం, దలఁపఁగ నిది చిత్ర మనఁగ ధర నితఁ డేలెన్. 255

తే. ఆయిలాతలవిభుమహనీయకీర్తి, పుండరీకంబుఁ బాయక యుండులక్ష్మి
వేడ్కఁ దాల్చినసంపంగివిరులబంతి, కరణిఁ గాన్పించు బ్రహ్మాండ మరసి చూడ.

ఉ. ఆయవనీశ్వరుర్ విమతు లాజి నెదుర్కొనుపాటివారు లే
రేయెడఁ గల్గినన్ రణము లించుక తద్బలపక్షకోటికిన్
జేయఁగ లేరు చేసినను జృంభితతన్మదకుంభికుంభవ
శ్యాయితనిర్ఝరీకుచములం దవియున్న ఖఘాతమాత్రముల్. 257

శా. తద్ధాటీసమయంబులం జటులగంధర్వాసిపాదాహతి
ప్రోద్ధూతక్షితిధూళి నింకెడుమహాంభోధిన్ ద్వీపన్మండలీ
శుద్ధాంతప్రమదావిలోచనము లశ్రుప్రాప్తిచేఁ గ్రమ్మఱన్
వృద్ధిం బొందఁగఁ జేయు మీనసఖతావిఖ్యాతి సార్థంబుగన్. 258